# ANDHRA SREEBHASHYA.

# ఆంధ్రశ్రీభాష్యము

భగవద్రామానుజాచార్యులవారిచే
బోధాయనవృత్తిసారముగా రచియింపఁబడిన
బ్రహ్మసూత్రభాష్యము.

హానరెబిల్ శ్రీ రాజా గోడే నారాయణగజపతిరాయనింగారి

సెలవుప్రకారము

శ్రీ పరవస్తు శ్రీనివాసజగన్నాథస్వామి అయ్యవారలుగారిచేఁ
తెనుఁగుచేయఁబడి

వారిసెలవుప్రకారము

ముద్రింపఁబడినది.

సంచిక.

PUBLISHED BY

Sree Paravastu Sreenivasa Jagannadhaswami Ayyavara'

Printed by N. Subbarow

Vizagapa

సము.

వా॥ ఆరమ్బణసంశీలనంపునః పునరభ్యాసః (ధ్యానము చేయవలసినదానిని మాటిమాటికిని తలంచుచుండుట యభ్యాసము.)

ఇచ్చట (ద్రమిడ) భాష్యకారుని చేత స్మృతిలోనిదైన (ఋషుల గ్రంథములలోనిదైన) నిర్వచనము దాహరింపఁబడినది.

(భగ॥ ౮అ॥ ౬ శ్లో॥) సదా తద్భావభావితః - (ఎల్లప్పుడును ఆతని తలంపు చేత కలుగఁజేయబడినవాఁడు - ఆతని తలంపు లేనిచో నిలువలేనివాఁడనుట -)

వా॥ పఞ్చమహాయజ్ఞాద్యనుష్ఠానం శక్తితః క్రియా - (శక్తికొలఁది పంచమహాయజ్ఞములను ఆచరించుట క్రియ -)

నిర్వచనము (ముణ్డ॥ ౩॥ ౧॥ ౪॥) క్రియావానేష బ్రహ్మవిదాం వరిష్ఠః - (క్రియగలవాఁడు బ్రహ్మము నుపాసించు వారిలో శ్రేష్ఠుఁడు -) అనియును -

(బృ॥ ౬॥ ౪॥ ౨౨॥) తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసాఽనాశకేన (బ్రాహ్మణులు ఆయీపరమాత్మను వేదము చదువుట చేతను యజ్ఞము చేతను దానము చేతను ఉపవాసమనెడి తపస్సు చేతను ఉపాసింపఁగోరుచున్నారు) అనియును.

వా॥ సత్యార్జవదయాదానాహింసానభిధ్యాః కల్యాణాని - (సత్యమనఁగా ప్రాణులకు పనికివచ్చెడి యథార్థమును చెప్పుట - ఆర్జవమనఁగా తనమాటయును పనియును మనస్సును ఒకటే విధముగా నుండుట - దయయనఁగా ఇతరుల దుఃఖములను పోఁగొట్టవలెననెడి సంకల్పము - దానమనఁగా ఈవి, అనఁగా లుబ్ధత లేకపోవుట - అహింసయనఁగా మాటచేతఁగానీ పని చేతఁగానీ మనస్సు చేతఁగానీ యేప్రాణినైనను బాధింపకుండుట - అనభిధ్యయనఁగా పరుఁడు చేసిన యపకారమును తలంపకుండుట - ఈయాఱును కల్యాణములు.)

( ) సత్యేనలభ్యస్తేషామేవైష విరజో బ్రహ్మలోకః (వారికి రజోగుణము లేని ఈ బ్రహ్మలోకము అనఁగా పరమపదము సత్యము చేతను పొందఁదగినది -) ఇత్యాదికము నిర్వచనము -

వా॥ దేశకాలనైగుణ్యాచ్ఛోకవస్త్వాద్యనుస్మృతేశ్చతజ్జం దైన్యమభాస్వరత్వం మనసోఽవసాదః- (దేశకాలములు మంచివికాకపోవుటవల్లనును దుఃఖమును కలుగఁజేసెడి విషయమును తలంచుటవలననును కలిగిన మనస్సుయొక్క దైన్యము అనఁగా మకిలగానుండుట యవసాదము) అట్టియవసాదము లేకపోవుట యనవసాదము-

(ము॥ ౩॥౨॥౪) నాయమాత్మా బలహీనేనలభ్యః- (మనోబలములేని వానిచేత నీయాత్మపొందఁబడఁదగినవాఁడుకాఁడు) అనినిర్వచనము-

వా॥ తద్విపర్యయజాతుష్టిరుద్ధర్షః॥ (అవసాదములేకపోవుటచేతననఁగా దేశకాలములు మంచివియగుటవల్లనును ఇష్టమైనవిషయముయొక్క తలంపువల్లనును గలుగుసంతోషము ఉద్ధర్షమనఁబడును-) అట్టియుద్ధర్షము లేకపోవుట యనుద్ధర్షము- అతిసంతోషమువిరోధియనుట-

(బృ॥ ౬॥ ౪॥ ౨౩॥) శాన్తోదాన్తః (చక్షుస్సుమొదలగు బాహ్యేంద్రియముల నిగ్రహముగలవాఁడును మనోనిగ్రహముగలవాఁడును) అనినిర్వచనము-

౨౪- ఇట్టి నియమములతోఁగూడిన వానికి బ్రహ్మచర్యాద్యాశ్రమములయందు విధింపఁబడినకర్మముల నాచరించుట చేతనే విద్యసిద్ధించుట యనిచెప్పఁబడినది యగుచున్నది- అట్లు శ్రుత్యంతరంబునుగలదు-

(ఈశా॥ ౧౧॥) విద్యాంచావిద్యాంచయస్తద్వేదోభయఁసహ। అవిద్యయామృత్యుంతీర్త్వా విద్యయామృతమశ్నుతే (విద్యయును అవిద్యయు ననెడి రెండిటినిగూడ నెవ్వఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడు అవిద్యచేత మృత్యువును దాఁటి విద్యచేత మోక్షమును పొందుచున్నాఁడు-) ఇచ్చట విద్యాశబ్దముచేత వర్ణాశ్రమములకు విధింపఁబడిన కర్మము చెప్పఁబడుచున్నది- అవిద్యయా=కర్మముచేత, మృత్యుమ్=జ్ఞానముపుట్టుటకు విరోధియైన ప్రాచీనకర్మమును తీర్త్వా=పోఁగొట్టి, విద్యయా=జ్ఞానముచేతను, అమృతమ్=బ్రహ్మమును, అశ్నుతే=పొందుచున్నాఁడు అనియర్థము-

౨౫. మృత్యువును దాఁటుటకు సాధనముగాఁ బ్రసిద్ధమైన యవిద్యావిద్యకంటె నితరమైన విహితకర్మము- విష్ణుపురాణమునందుఁ గూడఁ జెప్పఁబడినది.

(విష్ణుపు॥౬॥౬॥౧౨॥) ఇయాజసోపి సుబహూన్ యజ్ఞాన్ జ్ఞానవ్యపాశ్రయః। బ్రహ్మవిద్యామధిష్ఠాయ తర్తుం మృత్యుమవిద్యయా (ఆ కేశిధ్వజుఁడను జనకుఁడును శాస్త్రీయ జ్ఞానము కలవాఁడై బ్రహ్మోపాసనమును అవలంబించి అవిద్యచేత మృత్యువును దాఁటుటకై పెక్కు యజ్ఞములను చేసెను-)

౨౬- జ్ఞానవిరోధియైన కర్మము పుణ్యపాపరూపమైనది- బ్రహ్మజ్ఞానముపుట్టుటకు విరోధులగుటను అనిష్టమైన ఫలమును కలుగఁజేయునవి గాన రెంటను పాపశబ్దముచేఁ జెప్పంబడుట- ఇది జ్ఞానమునకు విరోధియగుట, జ్ఞానముపుట్టుటకు హేతువైన శుద్ధసత్త్వమునకు విరోధియయిన రజస్తమోగుణములు వృద్ధిఁబొందుట యను ద్వారమున- పాపము జ్ఞానముపుట్టుటకు విరోధియగుట (కౌషీ॥ ॥) ఏషఏవాసాధు కర్మకారయతి తంయమధోనినీషతి (ఈతఁడే అనఁగా భగవంతుఁడే ఎవ్వనిని అధోగతిని పొందింపవలయునని కోరునో వానిచేత అయుక్తమైన కర్మమును చేయించును) అనుశ్రుతిచేఁ దెలియఁజేయఁబడుచున్నది- రజస్తమస్సులు యథార్థమైన జ్ఞానమును ఆవరించుటయును, సత్త్వగుణము యథార్థజ్ఞానమునకు హేతువగుటయును (భగ॥౧౪॥౧౭॥) సత్త్వాత్సంజాయతే జ్ఞానం (సత్త్వగుణమువలన జ్ఞానము పుట్టుచున్నది-) ఇత్యాది గ్రంథముచేత భగవంతునిచేతనే ప్రతిపాదింపఁబడినవి-

౨౭ కాఁబట్టి జ్ఞానముపుట్టుటకై పాపకర్మమును నిరసింపవలయును- దాని నిరసించుట ఫలోద్దేశములేని ధర్మమును ఆచరించుటచేతఁ గలుగును- ఇందు శ్రుతి—

(తై॥నా॥౫౦అను॥) ధర్మేణ పాపమపనుదతి (ధర్మముచేత పాపమును పోఁగొట్టుచున్నాఁడు)

౨౮ కాఁగా నిట్లు బ్రహ్మమును పొందుటకు సాధనమైన జ్ఞానము సర్వాశ్రమకర్మముల యపేక్షకలది- కాఁబట్టి కావలసినకర్మములస్వ

రూపము తెలియుటయు, వట్టికర్మములు కొంచెమును అస్థిరమునగు ఫలముకలవియనుజ్ఞానంబును, కర్మమీమాంస చేతఁ దెలియఁదగినదిగా న అపేక్షితమైన యాకర్మమీమాంసయె బ్రహ్మజిజ్ఞాసకు పూర్వము గడచినదిగాఁ జెప్పబడవలసినది-

౨౯. ఇంతియెకాక నిత్యానిత్యవస్తువివేకాదులును మీమాంసను చదువక కలుగవు. ఫలము సాధనము, అంగకలాపము, అధికారి, వీనివిశేషముల నిశ్చయము లేక కర్మస్వరూపము, దానిఫలము, అదిస్థిరముగా నుండుట, స్థిరముగానుండకపోవుట, ఆత్మనిత్యుఁడగుట, మొదలగునవి తెలియశక్యములు కావు.

౩౦ వీనిసాధనత్వంబునువినియోగంబువలనఁ దెలియఁదగినది (వినియోగమనఁగాదీనికిదియంగమని తెలియఁజేయుట) ఆవినియోగము పూర్వమీమాంసలోని మూడవయధ్యాయములోనిది.

౩౧ ఉద్గీథాద్యుపాసనములు కర్మసమృద్ధికొఱకైనవైనను బ్రహ్మోపాసనరూపములై బ్రహ్మజ్ఞానాపేక్షగలవిగాన ఈశాస్త్రమున నె విచారింపఁబడవలసినవి. ఆకర్మములు గూడ ఫలోద్దేశములేనివై బ్రహ్మవిద్యపుట్టుటకె సాధనములుగాన ఆకర్మములకు మంచిగుణమును కలుగఁజేసెడి ఈయుద్గీథాద్యుపాసనములు మిక్కిలిగా నీశాస్త్రము నందె చేరియున్నవి. వానికికర్మస్వరూపజ్ఞానము నపేక్షయుండుట యెందులకును సంమతమే.

మహాపూర్వపక్షము-

౧ అద్వైతులు చెప్పుచున్నారు- అశేషవిశేషప్రత్యనీకంబై అనఁగా అన్నివిశేషములకును విరోధియై, జ్ఞానమాత్రంబగు బ్రహ్మమెపరమార్థము-మిగిలిన జ్ఞాత (తెలిసికొనువాఁడు), జ్ఞేయము (తెలియఁబడునది), వానివలనఁ గలిగిన జ్ఞానభేదములు, మొదలయిన యనేకవిధములయినదంతయు వానియందే కల్పింపఁ బడినదై మిథ్యాభూతము (అసత్యమైనది).

౨. (ఛా॥౬॥౨॥౧॥) సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయమ్ (ఓసోమ్యుఁడా! ఈజగత్తు సృష్టికి మొదటను బ్రహ్మమైయుండెను-ఆ బ్రహ్మము ఒక్కటియే- రెండవదిలేనిది) బ్రహ్మమే అన్న అవ

ధారణను చేత విజాతీయ భేదంబును, ఏకమేవ అనుటచే సజాతీయ భేదంబును, అద్వితీయమ్ అనుటచే స్వగత భేదంబును నివర్తింపఁబడినవి- (విజాతీయ భేదము లేకపోవుట యనఁగా తనకంటె విలక్షణమైన వస్తువు లేకపోవుట- సజాతీయ భేదము లేకపోవుట యనఁగా తనవంటి వస్తువు లేకపోవుట- స్వగత భేదము లేకపోవుట యనఁగా తాను అనేక వస్తువులుగా నుండకపోవుట-)

౩. (ము॥౧॥౧॥౬॥) అథ పరా యయా తదక్షరమధిగమ్యతే, యత్తదద్రేశ్యమగ్రాహ్యమగోత్ర మవర్ణ మచక్షుశ్శ్రోత్రం తదపాణిపాదమ్। నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం యద్భూతయోనిం పరిపశ్యన్తి ధీరాః (దేనిచేత నాయక్షరము తెలియఁబడునో యా పరవిద్య యనఁ జెప్పఁబడును. ఎయ్యది (అక్షరము) ప్రత్యక్షమునకు విషయము కానిదియు, అనుమానమునకు విషయము కానిదియు పేరు లేనిదియు, నలుపు మొదలగు వర్ణములు లేనిదియు, చక్షుస్సశ్రోత్రము మొదలగు జ్ఞానేంద్రియములు లేనిదియు, కాళ్లు చేతులు మొదలగు కర్మేంద్రియములు లేనిదియు, నిత్యమైనదియు, సర్వవ్యాపకంబును, అన్నిటిచేతను ఆధారముగాఁ బొందఁబడినదియు, మిక్కిలి సూక్ష్మమైనదియునో, దేనిని భూతములకు కారణమునుగా బుద్ధిమంతులు తెలిసికొనుచున్నారో.)

౪. (తై॥౨॥౧॥౧॥) సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ (మిథ్యాభూతము కానిదియు జడము కానిదియు పరిచ్ఛేదము లేనిదియు బ్రహ్మము.)

౫. (శ్వే॥౬॥౧౯॥) నిష్కలం నిష్క్రియం శాన్తం నిరవద్యం నిరఞ్జనమ్ (అవయవములు లేనిదియు కదలిక లేనిదియు ఊర్మిషట్కము లేనిదియు కర్మసంబంధము లేనిదియు కర్మఫలము లేనిదియు- ఊర్మిషట్కమనఁగ అశనాయాపిపాసలను అనఁగా ఆకలిదప్పికలును, శోకమోహములను అనఁగా దుఃఖాజ్ఞానములును, జరామృత్యువులను అనఁగా ముదిమి చావులును నాఱు.)

౬. (కే॥౨॥౩) యస్యామతం తస్య మతం మతం యస్య న వేద సః। అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాతమవిజానతామ్ (ఎవ్వనికి బ్రహ్మము శ్రవణవిషయము కాదో వానికి శ్రవణవిషయమైనది. ఎవ్వండు శ్రవణవిషయమైనదో వాఁడు ఎఱుఁగఁడు- మనసముచే బ్రహ్మమును తెలిసికొను

చున్నవారలకు మననము చేతఁ దెలియఁబడినది- మననము చేతఁ దెలిసికొన కయున్నవారలకు మననముచేఁ దెలియఁబడినది. శ్రవణమననవిషయము బ్రహ్మముకాదని తెలిసికొనుటయె బ్రహ్మమును తెలిసికొనుటయని భావము )

౭. (బృ||౫||౪||౨||) నదృష్టేర్ద్రష్టారం పశ్యేః... న మతేర్మన్తారం మన్వీథాః (శ్రవణము చేయువానిని శ్రవణముకంటె వేఱుగాఁ దెలిసికొనకుము- మననము చేయువానిని మననముకంటె వేఱుగాఁ దెలిసికొనకుము- )

౮. తై(||౩||౬||) ఆనన్దో బ్రహ్మ (ఆనన్దము బ్రహ్మము. )

౯. (బృ||౪||౪||౬||) ఇదగ్ం సర్వం యదయమాత్మా (ఈ యాత్మయనునదియె దికలదో ఇదియెయంతయును- ఆత్మయందె జగద్వ్యాప్తికలుగుచున్నదనట )

౧౦ (కఠ||౪||౧౧||) నేహ నానాస్తి కించన (ఇచ్చట నొకటియును భేదము కలది లేదు.)

౧౧. (కఠ||౪||౧౦||) మృత్యోః స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి (ఎవ్వఁడు ఇచ్చట భేదము కలదానివలె చూచుచున్నాఁడో, వాఁడు మృత్యువునుండి మృత్యువును పొందును. జన్మపరంపరారూపమైన సంసారమును పొందుననుట.)

౧౨. (బృ||౪||౪||౧౪||) యత్ర హి ద్వైతమివ భవతి తదితర ఇతరం పశ్యతి... యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్ ... తత్కేన కం పశ్యేత్ ... తత్కేన కం విజానీయాత్ (ఎప్పుడు భేదము వలెఁ గనఁబడుచున్నదో అప్పుడు నొకటి యొకటిని మఱియొకఁడు తెలిసికొనుచున్నాఁడు. ఎప్పుడు వీనికి అంతయును ఆత్మయెయయ్యెనో అప్పుడు ఏమిటియొకటి దానిచేత ఏమిటియొకటిని శ్రవణము చేయును; ఏయితరము చేత ఏయితరమును మననము చేయును? )

౧౩. ( ఛా||౬||౧||౪|| ) వాచారమ్భణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్ (ఘటాదివికారంబును నామంబును వ్యావహారికము- మృత్తికయనియె సత్యము.)

౧౪. (తై||౨||౭||౨||) యదా హ్యేవైష ఏతస్మిన్నుదరమన్త

రం కురుతే। అథ తస్య భయం భవతి (వీఁడు ఎప్పుడు ఈ బ్రహ్మము నందు కొంచెము భేదమును చేయుచున్నాఁడో, ఆవెంటనే వానికి సంసారభయము కలుగుచున్నది.)

౧౪ (ఉ॥మీ॥౩॥౨॥౧౧॥) న స్థానతోపి పరస్యోభయలిఙ్గం సర్వత్ర హి (బ్రహ్మమునకు ఉపాధిని బట్టికూడ రెండు లింగములును లేవు- బ్రహ్మమును తెలియఁజేసెడి వాక్యములలో సంతటనును బ్రహ్మము నిర్విశేషముగానే తెలియఁజేయఁబడుచున్నదిగదా-అని శంకరభాష్యము- ఇచ్చట శ్రుతప్రకాశికలో ఉభయలింగమనఁగా ఆకారముకలిగియుండుటయు, ఆకారముకలిగి యుండియాకారము లేక యుండుటయు నను రెండుధర్మములున్; బ్రహ్మము ఆకారములేనిది అని భావము, అనివివరింపఁబడినది)

౧౫ (ఉ॥మీ॥౩॥౨॥౩॥) మాయామాత్రంతు కార్త్స్న్యేనానభివ్యక్తస్వరూపత్వాత్ (స్వప్నములోని దంతయు మాయయే- నిరూపింపశక్యముకానిస్వరూపముకలదగుటవలన.)

౧౬. (విష్ణుపు॥౬॥౭॥౫౩॥) ప్రత్యస్తమిత భేదం యత్సత్తామాత్ర మగోచరమ్। వచసా మాత్మసంవేద్యం తజ్జ్ఞానంబ్రహ్మసంజ్ఞితమ్ (సజాతీయ విజాతీయభేదములులేనిదియు సత్తయనఁగా ఉనికిమాత్రమే అయినదియును అనఁగా స్వగతభేదములేనిదియు వాక్కులకు విషయము గానిదియు స్వయం ప్రకాశమైనదియు నేదియో, ఆజ్ఞానము బ్రహ్మ మనుపేరుగలది.)

౧౭- (విష్ణుపు॥౧॥౨॥౬॥) జ్ఞానస్వరూపమత్యన్త నిర్మలం పరమార్థతః। తమేవార్థస్వరూపేణ భ్రాన్తిదర్శనతస్స్థితమ్ (ప్రణమ్యేకథయామి= పరమార్థమున జ్ఞానస్వరూపుఁడును మిక్కిలి నిర్మలుఁడునుఅనఁగా విశేషము లేవియులేనివాఁడును, భ్రాన్తిదృష్టివలన జడవస్తుస్వరూపముగా నున్నవాఁడు నగు ఆతనికి నమస్కరించిచెప్పెదను.)

౧౮. (విష్ణుపు॥౧॥౪॥౩౮…౪౨॥) పరమార్థస్త్వమేవైకో నాన్యోస్తి జగతః పతే। తవైష మహిమాయేన వ్యాప్తమేతచ్చరాచరమ్ ॥౧॥ యదేతద్దృశ్యతే మూర్తమేతజ్జ్ఞానాత్మనస్తవ। భ్రాన్తిజ్ఞానే

న పశ్యన్తి జగద్రూపమయోగినః ॥౨॥ జ్ఞానస్వరూపమఖిలం జగదేతద బుద్ధయః। అర్థస్వరూపం పశ్యన్తో భ్రామ్యన్తే మోహసంప్లవే ॥౩॥ యేతుజ్ఞానవిదశ్శుద్ధచేతసస్తేఽఖిలంజగత్ । జ్ఞానాత్మకం ప్రపశ్యన్తి త్వద్రూపం పరమేశ్వర॥౪॥ (౧॥ జగత్తునకు అధిపతియైనవాఁడా! నీవు ఒక్కఁడవె సత్యమైనవాఁడవు. ఇతరమైనది లేదు. ఎవ్వనిచేత ఈ జంగమస్థావరరూపమైన జగత్తు వ్యాపింపఁబడినదో ఆనీ యొక్క మహిమయిది. ॥౨॥ జడమైనది పదికనఁబడుచున్నదో ఇది జ్ఞానస్వరూపుఁడవైన నీయొక్క జగత్తనెడిరూపము. దీనిని జ్ఞానులు కానివారు తమ భ్రాంతిజ్ఞానముచేతఁ జూచుచున్నారు॥౩॥ జ్ఞానస్వరూపమైన ఈ జగత్తునంతయు అజ్ఞులు జడపదార్థస్వరూపమును గాఁ జూచుచున్న వారై సంసారసముద్రమునందు తిరుగుచున్నారు.॥౪॥ ఓ పరమేశ్వరుఁడా! జ్ఞానులై పరిశుద్ధమైన మనస్సుకలవారు ఎవ్వరో, వారు, సమస్తమైన జగత్తును జ్ఞానస్వరూపమైన నీరూపమును గాను చూచుచున్నారు)

౨౦. (విష్ణుపు॥౨॥౧౪॥౩౧॥) తస్యాత్మపరదేహేషు సతోఽప్యేకమయం హి యత్। విజ్ఞానం పరమార్థోఽహి ద్వైతినోఽతథ్యదర్శినః (తనశరీరమందును ఇతరునిశరీరమందును ఉన్నవాఁడైనను ఆతనియొక్క ఒకటియైన జ్ఞానము ఏదికలదో అదియె యథార్థము. భేదమును వాదించువారు అసత్యమును తెలిసికొనువారు.)

౨౧. (విష్ణుపు॥౨॥౧౩॥౮౬॥) యద్యన్యోఽస్తి పరః కోఽపి మత్తః పార్థివసత్తమ। తదైషోఽహమయం చాన్యోవక్తుమేవమపీష్యతే॥ (ఓ రాజశ్రేష్ఠుఁడా! నాకంటె వేఱైన మఱియొక్కఁడెవ్వఁడైనను న్నపక్షమందు, అప్పుడు, వీఁడు, నేను, ఇతఁడు, మఱియొక్కఁడు, అని ఇట్లు కూడఁ జెప్పవచ్చును.)

౨౨. (విష్ణుపు॥౨॥౧౪॥౩౨॥) వేణురన్ధ్రవిభేదేన భేదష్షడ్జాదిసంజ్ఞితః। అభేదవ్యాపినో వాయోస్తథాఽసౌ పరమాత్మనః।(అభేదముగలదియు వ్యాపించునదియు నగు వాయువునకు వాసికఱ్ఱ యొక్క రంధ్రముల భేదము చేత షడ్జము మొదలగు భేదము ఎట్లో, అట్లె పరమాత్మకును భేదము)

౨౩ (విష్ణు ॥ ౨॥౧౬॥ ౧౩ .. ౨౪॥) సోహం స చ త్వం స చ సర్వమేతదాత్మస్వరూపం త్యజ భేదమోహమ్। ఇతీరితస్తేన స రాజవర్యస్తత్యాజ భేదం పరమార్థదృష్టిః (అట్టి నేనును అట్టి నీవును అంతయును ఇదయంతయును ఆత్మస్వరూపము- భేదపు మోహమును విడువుము- ఆ రాజశ్రేష్ఠుండు ఇట్లు ఆతనిచేతఁ జెప్పఁబడినవాఁడై పరమార్థజ్ఞానము కలవాఁడై భేదమును విడిచిపెట్టెను.)

౨౪. (విష్ణు ॥ ౬॥ ౭॥ ౯౬॥) విభేదజనకేఽజ్ఞానే నాశమాత్యన్తికం గతే। ఆత్మనో బ్రహ్మణో భేదమసన్తం కః కరిష్యతి॥ (భేదములను కలుగఁజేసెడి జ్ఞానము మిక్కిలి నాశమును పొందినదగుచుండఁగా ఆత్మకును బ్రహ్మమునకును లేని భేదమును ఎవ్వఁడు కలుగఁజేయును?)

౨౫. (భగ॥ ౧౦॥ ౨౦॥) అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః (ఓయర్జునుఁడా! నేను సమస్త శరీరములయందు నుండెడి యాత్మను గా నున్నాను.)

౨౬. (భగ॥ ౧౩॥ ౨॥) క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత (ఓయర్జునుఁడా! నన్ను అన్ని శరీరములయందును ఆత్మను గా నెఱుంగుము.)

౨౭. (భగ॥ ౧౦॥ ౩౯॥) న తదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరమ్ (నన్ను వినాగా నేదియుండునో అట్టి జంగమస్థావరరూపమైన భూతము లేదు.)

౨౮. ఇవి మొదలుగాఁగల వస్తుస్వరూపమును దెలియఁజేసెడి శాస్త్రములు నిర్విశేషచిన్మాత్ర బ్రహ్మమె అనఁగా విశేషములు లేనిదై జ్ఞానమాత్రమైన బ్రహ్మమె సత్యమనియును మిగిలినదంతయును అసత్యమనియును తెలియఁజేయుచున్నవిగదా.

౨౯. మిథ్యాత్వమనఁగా తెలియఁబడి, యథార్థమైన వస్తుజ్ఞానముచేత నివర్తింపఁదగినది యగుట- ఎట్లంటేని రజ్జువును చూచి యనుకొనఁబడిన సర్పమునందు మిథ్యాత్వము కలదు- (త్రా)డును చూచినతోడనె దూరముగా నుండుట మొదలగు దోషముచేత నది పాము అని తోచినది- ఇది త్రాడు గాని పాము కాదని వాస్తవమైన జ్ఞానము కలిగినపైని పాము తెలియఁబడదు గాన నా పాము మిథ్యాభూ

తమైనది- ఈపాము మొదట తెలియఁబడినతరువాత యథార్థ జ్ఞాన
ముచేత పోయినది కదా) దోషమువలనంగదా త్రాటియందు పాము
అని కల్పించుట కలిగినది- ఇట్లే జ్ఞానమాత్రస్వరూపుఁడగు పర
బ్రహ్మమునందు దోషముచేఁగల్పింపఁబడిన దేవతిర్యఙ్మనుష్యస్థా
వరాది భేదములగల యీ జగత్తు, ఉన్నదియున్నట్లు బ్రహ్మస్వరూ
పమును తెలిసికొనుటచే బాధింపఁబడఁదగినదై మిథ్యారూపమైనది.

౩౦. దోషం బేది యన్నను, స్వరూపమును ఉడ్డగించునదియై
అనేకవిధములును విచిత్రములు నగు విక్షేపములను అనఁగా అధ్యాస
ములను(భ్రాంతులను) చేయునదియై సత్తు అనియును అసత్తు అనియు
ను నిర్వచింప శక్యముకానిదగు అనాదియైనయవిద్య.

౩౧. (ఛా॥౮॥౩॥౨॥)అనృతేనహి ప్రత్యూఢాః- (అసత్యము
చేతను అపహరింపబడిరి-

౩౨. (ఛా॥౮॥౩॥౧॥)తేషాంసత్యానాం సతామనృతమపిధాన
మ్- (ఆసత్యములయి యున్నవానికి అసత్యము మూతయైయున్నది-)స
త్యములను బహువచనము అవివక్షితము గాన సత్యమైనబ్రహ్మమున
కు అవిద్య మూత యనియర్థము.

౩౩. (తై॥పరా॥౨॥౮॥౯॥అను॥)నాసదాసీ న్నోసదాసీత్తదా
నీమ్। తమ ఆసీత్తమ సాగూఢ మగ్రేప్రకేతమ్ (అప్పుడు అనఁగా
సృష్ట్యాదియందు, అసత్తు న అనఁగా లేనిదైన కుందేటికొమ్మువంటి
వస్తువును, సత్తయిన అనఁగావున్నదైన వస్తువును, లేదు-అజ్ఞానముఉం
డెను- ఆ మొదటికాలమందు అవిద్యచేతను జ్ఞానముదాగియుండెను )

౩౪. (శ్వే॥౪॥౧౦॥)మాయాంతుప్రకృతిం విద్యాన్మాయినంతు
మహేశ్వరమ్ (మాయను అవిద్యను గానును మాయగలవానిని ఈ
శ్వరుని గానును తెలిసికొనునది.)

౩౫. (బృ॥౪॥౫॥౧౯॥)ఇన్ద్రోమాయాభిః పురురూపఈయతే
(ఆత్మ, మాయలచేత అనేకరూపములు గలవాఁడుగా తెలియఁబడుచు
న్నాఁడు.)

౩౬. (భగ॥౭॥౧౪॥)మమమాయాదురత్యయా- (నామొక్క
మాయ ఐక్యజ్ఞానములేనివానిచే నతిక్రమింప శక్యముకానిది.)

౩౭. (మా॥౨॥౨౧॥) అనాదిమాయయాసుప్తో యదా జీవః ప్రబుధ్యతే। (ఆదిలేకుండెడిమాయ చేత నిద్రించిన జీవుఁడు ఎప్పుడు మేలుకొనుచున్నాఁడో.)

౩౮. ఇత్యాది వాక్యములచేత విశేషము లెవ్వియు లేక జ్ఞానమాత్రస్వరూపమైన బ్రహ్మమె, సత్తైనియునసత్తైనియు నిర్వచింపశక్యము కానిదై యాదిలేనిదగు నవిద్యచేత నచ్ఛాదింపఁబడిన స్వరూపము గలదై, తనయందు నానాత్వమును అనఁగా భేదమును తెలిసికొనుచున్నదని తెలియఁబడుచున్నది—ఇట్లు విష్ణుపురాణములోఁ గూడఁ జెప్పఁబడినది.

౩౯. (విష్ణుపు॥౨॥౧౨॥౪౦-౪౧॥) జ్ఞానస్వరూపో భగవాన్యతో సావశేషమూర్తిర్నతు వస్తుభూతః। అతో హి శైలాబ్ధిధరాదిభేదాన్ జానీహి విజ్ఞానవిజృమ్భితాని॥౧॥ యదా తు శుద్ధం నిజరూపి సర్వకర్మక్షయే జ్ఞానమపాస్తదోషమ్। తదా హి సంకల్పతరోః ఫలాని భవన్తి నో వస్తుషు వస్తుభేదాః॥౨॥ (ఏహేతువువలన జ్ఞానస్వరూపుఁడైన భగవంతుఁడె అన్నిమూర్తులుగలవాఁడును అన్నిఆకారములును కానివాఁడును అగుచున్నాఁడో, ఇందువలన పర్వతములు సముద్రము భూమి మొదలగు భేదములను అజ్ఞానము యొక్క విలాసములనుగాను తెలిసికొనుము- వివిధమును గాదీనిచేతఁ దెలియఁబడును గాన విజ్ఞానము నీ యవిద్యయె చెప్పఁబడును॥౨॥ ఎప్పుడు అన్నికర్మములును క్షయింపఁగా జ్ఞానము దోషము పోయినదై పరిశుద్ధమైతన స్వరూపము గలదియగుచున్నదో, అప్పుడు సంకల్పము అనఁగా అవిద్యయనెడి వృక్షము యొక్క ఫలములైన వస్తువులయందలి వస్తువిశేషములు కలుగవు-)

౪౦. (విష్ణుపు॥౨॥౧౨॥౪౪…౪౬॥) తస్మాన్న విజ్ఞానమృతేస్తి కిఞ్చిత్క్వచిత్కదాచిద్ద్విజ వస్తుజాతమ్। విజ్ఞానమేకం నిజకర్మభేదవిభిన్నచిత్తైర్బహుధాభ్యుపేతమ్॥౧॥ జ్ఞానం విశుద్ధం విమలం విశోకమశేషలోభాదినిరస్తసఙ్గమ్। ఏకం సదైకం పరమం పరేశస్స వాసుదేవో న యతోన్యదస్తి॥౨॥ సద్భావ ఏవం భవతో మయోక్తో జ్ఞానం యథా సత్యమసత్యమన్యత్। ఏతత్తు యత్సంవ్యవహారభూతం తత్రాపి చోక్తం భువనాశ్రితం తే॥౩॥ (౧॥ ఓ మైత్రేయుఁడా! జ్ఞానము తప్ప మఱియేమియు

వస్తుసమూహము ఒకటి చోనును ఒకటి స్వాదును లేవు-ఒకటే జ్ఞానమే తన కర్మభేదములచేత ననేక భేదములగల చిత్తములుగలవారిచే ననేక విధములుగా నంగీకరింపఁబడినది-॥౨॥ పరిశుద్ధమైనదియు నిర్దోషమైనదియు దుఃఖములు లేనిదియు సమస్తమైన లోభాదికములతోడ సంబంధము లేనిదియును ఒకటైనదియు ఎల్లప్పుడును ఒకటే విధముగా నుండునదియు గొప్పదియునగు జ్ఞానమే పరమేశ్వరుఁడగు వాసుదేవుఁడు- ఎవ్వనికంటె నితరము లేవో॥౩॥ ఇట్లు వస్తుస్థితి నీకు నాచేతఁ జెప్పఁబడినది- జ్ఞానమెట్లు సత్యమో అట్లు మిగిలినది అసత్యము-ఏయజ్ఞానము లోకము నాశ్రయించినదై అంతటను వ్యవహారమునకు విషయమైనదై యున్నదో దానివిషయమైన కారణము అవిద్యయని కూడ నీకుఁ జెప్పఁబడినది-)

౪౧. ఈయవిద్యకు, విశేషము లేమియు లేనిదై జ్ఞానమాత్రమైన బ్రహ్మంబును, తానును ఒకటియె యనెడి జ్ఞానముచేత నివృత్తియని ఇఁక చెప్పఁబడు శ్రుతులు చెప్పుచున్నవి-

౪౨. ( )న పునర్మృత్యవే తదేకం పశ్యతి॥ (తిరిగియు నవిద్యకలుగుటకు ఆయొకటి దానిని చూడఁడు-)

౪౩. (ఛా॥ ౭॥ ౨౬॥ ౨॥) న పశ్యో మృత్యుం పశ్యతి (బ్రహ్మమును తెలిసికొనువాఁడు అవిద్యను పొందఁడు-)

౪౪. (తై॥ ౨॥ ౭॥ ౨॥) యదా హ్యేవైష ఏతస్మిన్నదృశ్యేఽనాత్మ్యేఽనిరుక్తేఽనిలయనేఽభయం ప్రతిష్ఠాం విన్దతే అథ సోఽభయం గతో భవతి (ప్రత్యక్షాదులచేఁ దెలియఁబడనిదియు శరీరము గానిదియు పేరుకొనఁబడనిదియు ఆధారము లేనిదియు నగు నీయాత్మతత్త్వమందు, వీఁడు ఎప్పుడు అభయము కొఱకు నిలుకడను పొందుచున్నాఁడో, అప్పుడీ వీఁడు భయమును పొందినవాఁడగుచున్నాఁడు-)

౪౫. (ము॥ ౨॥ ౨॥ ౮॥) భిద్యతే హృదయగ్రన్థిశ్ఛిద్యన్తే సర్వసంశయాః। క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే॥ (కారణములును కార్యములును స్వరూపముగాఁగల బ్రహ్మను తానే యని తెలియఁబడినదగుచుండఁగా హృదయమునకు ముడివంటిదైన అవిద్యావాసన మొదలగునది విడిపోవుచున్నది- అన్ని సంశయములును తెగ

గొట్టఁబడుచున్నవి, వీనికర్మములు క్షయింపుచున్నవి-)

౪౬. (ము॥3॥౨॥౯॥)బ్రహ్మవేదబ్రహ్మైవభవతి (బ్రహ్మమును తెలిసికొనుచున్నవాఁడు బ్రహ్మమేయగుచున్నాఁడు-)

౪౭. (శ్వేతా॥3॥౮॥)తమేవవిదిత్వాఽతిమృత్యుమేతి- (అతనినే తెలిసికొనియె మృత్యువును అతిక్రమింపుచున్నాఁడు)

౪౮. (పురు॥౧౭॥) నాన్యఃపన్థాః (మఱియొకమార్గము లేదు)ఇత్యాదులు-

౪౯. ఈశ్రుతులలో మృత్యుశబ్దముచేత నవిద్యగ్రహింపఁబడుచున్నది- ఇందు సనత్సుజాతవచనము-

౫౦. (మహాభా॥ఉద్యో॥౪౧అ॥౪శ్లో॥) ప్రమాదంవైమృత్యుమహంబ్రవీమి సదాప్రమాదమమృతత్వంబ్రవీమి(ప్రమాదము ననఁగా భ్రాంతిని అనఁగా భ్రాంతిని కలుగఁజేసెడి యవిద్యనె మృత్యువునుగానేను చెప్పుచున్నాను-అవిద్య లేకపోవుటనే మోక్షమునుగాఁ జెప్పుచున్నాను)అని-

౫౧. (తై॥౨॥౧॥౧)సత్యంజ్ఞానమనన్తంబ్రహ్మ(మిథ్యాభూతముకానిదియుజడముకానిదియు పరిచ్ఛేదములేనిదియు బ్రహ్మము)

౫౨. (బృ॥౫॥౯॥౨౮॥)విజ్ఞాన మానన్దం బ్రహ్మ (బ్రహ్మము జ్ఞానస్వరూపమును దుఃఖముకానిదియు)ఇత్యాదిశోధక వాక్యములచే (బ్రహ్మస్వరూపమును శోధించెడివాక్యములచేత) తెలియఁదగిన, నిర్విశేష బ్రహ్మంబును ఆత్మయనొకటియె యనెడిజ్ఞానము, (బృ॥3॥౪॥౧౦॥) అథయోऽన్యాందేవతాముపాస్తేऽన్యోऽసావన్యోऽహమస్మీతి(ఇంకను ఎవ్వఁడు, ఈదేవతవేఱు నేనువేఱు అనిఇతరమైన దేవతనుఉపాసనచేయుచున్నాఁడో)(బృ॥3॥౪॥౭)నసవేద-అకృత్స్నోహ్యేషః-ఆత్మేత్యేవోపాసీత(వాఁడెఱుఁగఁడు- వీఁడుఅసంపూర్ణుఁడుగదా-ఆత్మయనియెయుపాసించునది) ( )

త్వంవాఅహమస్మిభగవో దేవతేఅహంవైత్వమసిభగవోదేవతే (ఓషడ్గుణైశ్వర్యసంపన్నురాలైనదేవతా! నీవే నేను అగుచున్నానుగదా- ఓషడ్గుణైశ్వర్యసంపన్నురాలైన దేవతా! నేనే నీవు అగుచున్నావుగదా) ( ) తద్యోऽహంసోऽసౌయోऽసౌసోऽహమ్

(కాఁబట్టి నేనెవ్వఁడనో యతఁడును వాఁడె, వీఁడెవ్వఁడో నేనును అతఁడనె) ఇత్యాదివాక్యములచే సిద్ధమైనది.

౫౩. ఈయంశమును సూత్రకారుఁడును చెప్పెను- (౪॥౧॥౩) ఆత్మేతితూపగచ్ఛన్తి గ్రాహయన్తి చ (ఆత్మయని యుపాసనము చేయవలెను- మోక్షముఁగోరువారు అట్లే ఉపాసించుచున్నారు- శాస్త్రములు అట్లే తెలియఁజేయుచున్నవి) అని- వాక్యకారుఁడును అట్లే చెప్పెను.

౫౪. వా॥ ఆత్మేత్యేవతుగృహ్ణీయాత్సర్వస్యతన్నిష్పత్తేః (ఆత్మయని యొగ్రహించునది- అంతయును దానియందే కల్పింపఁబడుటవలన) అని.

౫౫. ఈ బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానము చేత మిథ్యారూపమైన బంధము తనకారణముతోఁగూడ నివర్తించుట యుక్తమె.

౫౬. ప్రత్యక్షవిరుద్ధమైన సకలభేదనివృత్తి (భేదములన్నియు నివర్తించుట) శాస్త్రమువలనఁగలిగెడి జ్ఞానమువలన ఎట్లు కలుగును?- అట్లైనచో ఇది త్రాడుగాని సర్పము కాదు అను జ్ఞానము చేత ప్రత్యక్షవిరుద్ధమైన సర్పనివృత్తి యెట్లు కలుగుచున్నది?— అట్లు కాదు- అచ్చట రెండు ప్రత్యక్షములకు విరోధము- ఇచ్చట ప్రత్యక్షమూలముగాఁగల శాస్త్రంబునకును ప్రత్యక్షంబునకును- అంటివా ని, సమానములకు విరోధము వచ్చినప్పుడైనను బాధ్యబాధకభావము (ఒకటిబాధింపఁబడుటయు నొకటిబాధించుటయును) ఎట్లు?— ఒకటిముందుపుట్టియుండుటయు రెండవది తరువాతఁ గలుగుటయు, ఒకటిదోషముతోఁగూడిన కారణమువలనఁబుట్టుటయు నొకటియట్లు కాకుండుటయు బాధ్యబాధకములగుటకు హేతువంటివేని, ఇది శాస్త్రంబునకును ప్రత్యక్షమునకునుగూడ సమానమే-

౫౭. ఫలితార్థము- బాధ్యబాధకభావమునకు సమానములగుట అపేక్షకలిగియుండుట అపేక్షలేకుండుట ఇవి మొదలగునవి కారణములు కావు- జ్వాలాభేదానుమానము చేత ప్రత్యక్షము బాధింపఁబడలేదా- అచ్చట జ్వాలయొక్కటియె యని ప్రత్యక్షముచేఁ దెలియఁబడుచున్నది- కాఁగా రెండు ప్రమాణములలో దేనికి మఱియొక్క విధమున సిద్ధియని యూహింపవచ్చునో యది బాధ్యము- అట్లు గత్యంతరము లేనిదై నిరవకాశమైనది బాధకము- అని ఇట్లు అంతటను బాధ్యబాధకభావసిద్ధి

యను.

౫౮. కాఁబట్టి ఆద్యంతములు లేనిదియు ఎడతెగనిసంప్రదాయము అనఁగా ఉపదేశపరంపరకలదియు దోషలేశమునైన నూహింపనవకాశము లేనిదియును నిరవకాశమైనదియునగు శాస్త్రీయమువలనఁగలిగిన,విశేషములు లేనిదియు నిత్యంబును పరిశుద్ధంబును బంధము లేనిదియును ప్రకాశించుచున్నదియు స్వయం ప్రకాశమైనదియునగు జ్ఞానమాత్రమైయున్న బ్రహ్మమే ఆత్మయనెడిజ్ఞానముచేత,ఊహింపఁదగిన దోషములుఁ గలవియు సావకాశములునగు ప్రత్యక్షాదులచేత సిద్ధించిన యనేకవిధములగు వికల్పములై (విషయములు లేక కలిగెడు జ్ఞానములై) స్వరూపముగాఁగలబంధము నివర్తించుటయుక్తమే- అనేకవిధములగు వికల్పముల భేదములుగల ప్రపంచమును గ్రహించెడి ప్రత్యక్షమునకు అనాదిభేదవాసనారూపమై అవిద్యయనెడి పేరుగల దోషముకలదుగదా-

౫౯. అట్లైనచో ఆద్యంతములు లేనిదై అవిచ్ఛిన్నమైన సంప్రదాయము కలదగుటచే నిర్దోషమగు వేదములోఁ జేరిన( ) జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత (స్వర్గమును గోరువాఁడు జ్యోతిష్టోమమను యాగమును చేయునది) అనునది భేదము నవలంబించియున్నదిగాన బాధింపఁబడవలసివచ్చును — అగును- పూర్వాపరాపచ్ఛేదమున పూర్వశాస్త్రము వలెనే ఈజ్యోతిష్టోమ శాస్త్రముకూడ మోక్షశాస్త్రము నిరవకాశముగాన దానిచే బాధింపఁబడును (పూర్వమీమాంసలో ౬వయధ్యాయమున ౫ పాదమున ౧౯ అధికరణము ఈయపచ్ఛేదాధికరణము- అదియెట్లన్నను- జ్యోతిష్టోమయాగమున ప్రాతస్సవనమున బహిష్పవమానమనుస్తోత్రము చేయఁబడఁగలదు ఋత్విక్కులు శాలనుండి వెలుపటికి నడతురు- అప్పుడు వారు చీమలవలె ఒకనివెంట నొకఁడు నడువవలసినది- అప్పుడు ముందునడచువానికచ్ఛను పట్టుకొని వెనుకటివాఁడు నడచునది- అధ్వర్యువు వెంటను ప్రస్తోతయు ప్రస్తోత వెంటను ఉద్గాతయును ఉద్గాత వెంటను ప్రతిహర్తయు నడచునది- అప్పుడు వ్యగ్రుఁడై కచ్ఛను వదలినయెడను ఆవదలుటకు అపచ్ఛేదమని పేరు- అందుకు ప్రాయశ్చిత్తమెట్లన్నను- ప్రతిహర్త వదలినయెడను సర్వవేదసమును ఇచ్చునది- అనఁగా తనకుఁ గలయాస్తి నంతయు నిచ్చునది- ఉ

ద్గాతవదలినయెడను దక్షిణలేకుండ యజ్ఞమునుచేసి ఆయజ్ఞమును తిరిగియునాచరించునది- అప్పుడు వెనుకసంపాదింపఁబడినదానినిచ్చునది అని- ఇట్లనుద్గాతయు ప్రతిహర్తయు వేఱువేఱుప్రయోగములలోవదలినయెడను వానివాని ప్రాయశ్చిత్తశాస్త్రముప్రవర్తించును- ఒకప్రయోగమున ఇద్దఱునొకమాఱువదలినయెడను ఉద్గాతయొక్కప్రాయశ్చిత్తముప్రవర్తించును- ఎందువలననంటేని, అతఁడువర్గమునకు ప్రధానుఁడు- ప్రధానమైనఅపచ్ఛేదమునకే ప్రాయశ్చిత్తముచేయవలసినది- లేకవికల్పముగానైను జేయవచ్చును- ఒకప్రయోగమునందెముందొకఁడునుతరువాతనొకఁడునువదలినయెడనుపూర్వశాస్త్రముకంటె పరశాస్త్రముప్రబలమని చెప్పఁబడినది-)

౬౦. వేదాంతవాక్యములలోఁగూడ సగుణబ్రహ్మోపాసనమును తెలియఁజేసెడివాక్యములకుఇదియెన్యాయము- ఎందువలననంటేని పరబ్రహ్మము నిర్గుణమగుటవలన.

౬౧. (ము॥౧॥౧॥౯) యస్సర్వజ్ఞస్సర్వవిత్-(ఎవ్వఁడుసామాన్యముగానన్నిటినెఱిఁగినవాఁడును, విశేషముగానన్నిటినెఱిఁగినవాఁడునో)

(శ్వే॥౬॥౮)పరాస్యశక్తిర్వివిధైవశ్రూయతే స్వాభావికీజ్ఞానబలక్రియాచ( ఈతనికి అనేకవిధములుగలగొప్పశక్తియును, స్వభావసిద్ధమైనజ్ఞానంబును బలంబును సృష్ట్యాదివ్యాపారంబును శ్రుతిలో వినఁబడుచున్నవి-)

(ఛా॥౮॥౭॥౧)సత్యకామస్సత్యసఙ్కల్పః- (సత్యములైనకామములుగలవాఁడును సత్యమైనసంకల్పముగలవాఁడును-)

ఇదిమొదలగుబ్రహ్మస్వరూపమును తెలియఁజేసెడి వాక్యములెట్లు బాధింపఁబడును? అనినను, నిర్గుణవాక్యసామర్థ్యమువలన (నిర్గుణుఁడైనయాత్మను తెలియఁజేసెడివాక్యములబలమువలన)బాధింపఁబడునని చెప్పెదము-

౬౨. ఫలితార్థము- (బృ॥౩॥౮॥౮)అస్థూలమనణ్వహ్రస్వమదీర్ఘమ్(వలముకానిది, సన్నముకానిది, పొట్టిదిగానిది, పొడవైనదిగానిది) (తై॥ఆ॥౧॥౧)సత్యంజ్ఞానమనన్తంబ్రహ్మ(మిథ్యాభూతము

కానిదియు జడముకానిదియు పరిచ్ఛేదములేనిదియు బ్రహ్మము) ( ) నిర్గుణమ్ నిరఞ్జనమ్ (గుణములులేనిదియు సంసారములేనిదియు) ఇవి మొదలగు వాక్యములు, విశేషములన్నియు లేనిదియు అన్నిటికిని అధిష్ఠానమనఁగా ఆధారంబును నిత్యంబునగు జ్ఞానమే బ్రహ్మమని తెలియఁజేయుచున్నవి- మిగిలినవాక్యములు సగుణమును తెలియఁజేయుచున్నవి- ఈ రెండు విధములైన వాక్యములకును విరోధముకలుగఁగా యాయపచ్ఛేదన్యాయమును బట్టియె నిర్గుణవాక్యములు గుణములయపేక్షకలవగుటచే పరములగుటను మిక్కిలి బలముగలవిగాననేమియు కొదువలేదు-)

౬౩. (తై॥౨॥౧॥౧॥) సత్యంజ్ఞానమనన్తంబ్రహ్మ-అనునప్పుడు సత్యజ్ఞానాదిగుణములు కనఁబడుచున్నవే?- లేదు- సామానాధికరణ్యముచే ఒక్కటే యర్థముతోఁచుచున్నది- అనేక గుణములు కలిగియున్నట్లు చెప్పినను ఏకార్థత్వమునకు విరోధములేదంటివేని: నీవు అర్థము చెప్పుటను ఎఱుంగవు- ఏకార్థత్వమనఁగా అన్నిపదములకు నర్థమొక్కటియగుట- విశేషములతోఁగూడుకొనినవానిని పదములకు అర్థములనుగాఁ జెప్పినయెడను విశేషణములు భేదించుటవలన పదములయర్థము భేదించుటతప్పదు- అందువలన నేకార్థత్వము సిద్ధింపదు- అట్లున్నపదములునొక్కయర్థమునె చెప్పునెడల పర్యాయములు కావలసివచ్చునేయన్నను - ఒక్కయర్థమును చెప్పినను పర్యాయములు కాకుండుటను జెప్పెదను, శ్రద్ధగలమనస్సుతో వినుము- ఒక్కటియేయనెడి తాత్పర్యనిశ్చయమువలన నర్థమొక్కటియైనను, ఆయాపదార్థములవిరోధులకు విరోధియగుటను చెప్పుటచేత, అన్ని పదములును ప్రయోజనముకలవియు ఒక్కయర్థమును జెప్పునవియు పర్యాయములుకానివియునగుట సిద్ధింపుచున్నది-

౬౪ ఫలితార్థము-లక్షణమునఁ దెలియవలసిన బ్రహ్మము సకలేతరపదార్థములకు విరోధియైన స్వరూపముకలది-దానికి విరోధియైన స్వరూపమంతయు నీమూడుపదములచేతను ఫలితముగ నిరసింపఁబడుచున్నది- అందు సత్యపదము, వికారములకాస్పదమగుటంబట్టి అసత్యమైన వస్తువునకంటె వ్యావృత్తమైన బ్రహ్మమును తెలియఁజేయునది- జ్ఞానపద

ము,మఱియొకఁ-దానివలనఁ బ్రకాశించెడి అనఁగా తెలియఁబడెడిజడ రూపమైనవస్తువుకంటె వ్యావృత్తమైనదానిని తెలియఁజేయునది-అనంతపదము,దేశమునుబట్టియు కాలమునుబట్టియు వస్తువునుబట్టియు పరిచ్ఛిన్నమైనదానికంటెవ్యావృత్తమైనదానిఁదెలియఁజేయును- వ్యావృత్తియనునది భావరూపంబైనన భావరూపంబైననగుధర్మముకాదు-మఱియేమన్నను- ఇతరములన్నిటికిని విరోధియగుబ్రహ్మమె- తెలుపు మొదలగుదానియందుండెడి కార్ష్ణ్యాదివ్యావృత్తి (నలుపు మొదలగుదానియొకఁ-వ్యావృత్తి),ఆయాపదార్థస్వరూపమెకాని మఱియొకఁ-ధర్మమెట్లు కాదో, ఇట్లె,ఒకఁ-వస్తువే మిగిలినయన్నిటికిని విరోధియైనస్వరూపముగలదిగా తెలియఁజేయుచున్నవై మూఁడుపదములునుమిక్కిలిప్రయోజనముగలవియు ఒకఁ-యర్థమును జెప్పనవియు పర్యాయములుగానివియునగును- అందువలనబ్రహ్మమొకఁ-టియెస్వయంప్రకాశమైనదియు విశేషములన్నియు లేనిదియునని చెప్పఁబడినదగుచున్నది- ఇట్లు వాక్యార్థమును చెప్పినయెడనే(ఛాం॥౬॥౨॥౧)సదేవసోమ్యేదమగ్రఆసీదేకమేవాద్వితీయమ్ (ఈజగత్తుసృష్ట్యాదియందుసత్తైఅనఁగాబ్రహ్మమేఅయియుండెను- ఒకఁటేయయియుండెను- రెండవదిలేనిదైయుండెను) అనునది మొదలుగాఁగలవాక్యములతో సమానమైనయర్థముకలదగుచున్నది-

ఉ౫. (తై॥౩॥౧॥౧) యతోవాఇమానిభూతానిజాయన్తే( ఈ భూతములు దేనివలనఁబుట్టుచున్నవో-) (ఛా॥౬॥౨॥౧)సదేవసోమ్యేదమగ్రఆసీత్ (ఐత॥౧॥౧॥) ఆత్మావా ఇదమేకఏవాగ్రఆసీత్ (ఈజగత్తు సృష్ట్యాదియందు ఒకఁ-యాత్మయైయుండెను) ఇది మొదలగువానిచేత జగత్కారణముగాఁజెప్పఁబడిన బ్రహ్మము యొకఁ-స్వరూపము, (తై॥౨॥౨॥౧)సత్యంజ్ఞానమనన్తంబ్రహ్మఅనుదానిచేఁజెప్పఁబడుచున్నది-అందుసర్వశాఖాప్రత్యయన్యాయమునకారణవాక్యములన్నిటియందును సజాతీయవిజాతీయములకంటెవ్యావృత్తమైనదియు రెండవదిలేనిదియునగు బ్రహ్మము తెలియఁబడుచున్నది- (సర్వశాఖాప్రత్యయన్యాయమనఁగాఅనేకవేదశాఖలలోనొకఁ-యంశమును జెప్పినప్పుడుకొన్నిటిలోకొన్నియంశములు చెప్పఁబడకపో

యినను రెండవశాఖలోఁ జెప్పినవానిని చేర్చికొనవచ్చుననెడిన్యాయము-) జగత్కారణముగాఁ జెప్పఁబడినదియు రెండవదిలేనిదియునగుబ్రహ్మముయొక్క తెలియఁజేయనుద్దేశింపఁబడిన స్వరూపంబును దానితోవిరోధములేకుండునట్లు చెప్పఁబడవలయును- అద్వితీయుఁడని చెప్పినదిగుణమయికూడ రెండవదియుండుటనుసహింపదు- అట్లుకానియెడను నిరఞ్జనం నిర్గుణమ్ ఇత్యాదిశ్రుతులతో విరోధమువచ్చును- కాఁబట్టియీలక్షణవాక్యము అఖణ్డైకరసమైనదానినె అనఁగా నిర్విశేషత్వమొక్కటియె స్వభావముగాఁగలదానినే తెలియఁజేయుచున్నది-

౭౭. సత్యజ్ఞానాదీపదములు తమయర్థమునువిడిచిపెట్టి తమయర్థమునకువిరోధించెడివస్తువులకంటె వ్యావృత్తమైనవస్తుస్వరూపమును తెలియఁజేయునవియైనయెడనులక్షణను (అముఖ్యార్థమును తెలియఁజేయుటను) చెప్పవలసివచ్చునేయన్నను, ఇది దోషముకాదు- అభిధానవృత్తి (ముఖ్యార్థమును తెలియఁజేయుట) కంటెతాత్పర్యవృత్తి (తాత్పర్యార్థమును తెలియఁజేయుట) మిక్కిలిబలముగలది- సామానాధికరణ్యమునకు (పదములువిశేషణవిశేష్యములగుటకు) ఐక్యమందె తాత్పర్యమనునది సర్వసంమతముగదా- అన్నిపదములకును లక్షణను ఎచ్చటనుంజూచియుండలేదేయన్నను, అందువల్లనేమిబాధకము? వాక్యములోనితాత్పర్యమునకు విరోధములేనియప్పుడు ఒక్కపదమునకైనను లక్షణనుచూచియుండలేదు- చేరియున్నపదములకన్నిటికిని ఇది తాత్పర్యమని నిశ్చయింపఁబడినదగుచుండఁగా, ఆతాత్పర్యవిరోధములేకుండుటకై ఒక్కపదమునకుఁజెప్పినయట్లు రెండిటికైనను మూడిటికైనను అన్నిపదములకునైనను లక్షణనుజెప్పుటతప్పుకాదు- అట్లు శాస్త్రములవారుగూడనొప్పుకొనుచున్నారు- కార్యమేవాక్యమునకర్థమనివాదించువారు (ప్రాభాకరులు), లోకములోని వాక్యములలోనన్నిపదములకును లక్షణనుఒప్పుకొనుచున్నారు- అపూర్వమనెడికార్యమునెలిఙ్లు మొదలగునవి ముఖ్యముగాఁజెప్పును- క్రియారూపమగుకార్యమును లిఙ్లు మొదలగునవిలక్షణచేఁజెప్పును- కార్యముతోఁగూడిన తమ తమయర్థములనుజెప్పెడి మిగిలినపదములకుఁగూడ

అపూర్వమనెడి కార్యముతోఁగూడినదియే ముఖ్యార్థము. కాఁబట్టి క్రియయనెడి కార్యముతోఁగూడినదానిఁదెలియఁజేయుట లాక్షణికమె (అముఖ్యమే). ఇందువలన వాక్యతాత్పర్యముతో విరోధము లేకుండుటకై అన్నిపదములకును లక్షణనొప్పుటయు దోషము కాదు.

౬౭. కాఁబట్టి ఈయంశమునే తెలియఁజేయుచున్నవై యుపనిషత్తులు ప్రమాణమగుచున్నవి.

౬౮. ప్రత్యక్షాదులతో విరోధము వచ్చినప్పుడు శాస్త్రమునకె ప్రాబల్యము చెప్పఁబడినది. విరోధమున్నంగదా ప్రాబల్యమును చెప్పవలయును. విరోధమేకనఁబడదు. ప్రత్యక్షము విశేషములు లేనిదైన సత్తు (ఉన్నది) మాత్రమును బ్రహ్మమునె గ్రహించును.

౬౯. ఘటము కలదు, పటము (బట్ట) కలదు, అని అనేకయాకారములుగల వస్తువులు విషయములుగాఁగలదియైన ప్రత్యక్షము సన్మాత్రమును గ్రహించునని యెట్లు? విలక్షణమైనవానిగ్రహించుట లేనియెడను అన్నిజ్ఞానములకును ఒక్కటియే విషయమైనచో ధారావాహికజ్ఞానమువలె నొక్కవ్యవహారమును కలుగఁజేయునది కావలయునే. (ధారావాహికజ్ఞానమనఁగా ఒక్క వస్తువునందె వరుసగాఁబుట్టి యొక్కవిషయముగానుండెడి యనేకజ్ఞానములపరంపర) అని శంకింతురేని- దానినే స్పష్టపరచెదము. ఘటముకలదు అనునప్పుడు అస్తిత్వంబును (కలిమియును) దానిభేదంబును వ్యవహరింపఁబడుచున్నవి. ప్రత్యక్షజ్ఞానమొక్కక్షణమే యుండునదియగుటవలనను, రెండు వ్యవహారములకును కాలంబును జ్ఞానంబును ఫలంబును భిన్నములగుటవలనను, రెండును ఒక్క ప్రత్యక్షమునకు అనఁగలుగుట సంభవింపదు. కాఁబట్టి ప్రత్యక్షమునకు, స్వరూపము విషయమా, భేదము విషయమా యని విచారింపవలసియున్నది. అందు భేదగ్రహణమునకు స్వరూపమును గ్రహించుటయొక్కయు దాని ప్రతియోగిని తలంచుటయొక్కయును అపేక్షకలదు. కావున నట్టియపేక్షలేని స్వరూపమె ప్రత్యక్షముచేత గ్రహింపఁబడవలయును. (దేనియభావము గ్రహింపఁబడునో అది ఆయభావమునకు ప్రతియోగియనఁబడును. ఆభావము సాధారణముగా భేదమును అత్యంతాభావమునని రెండువిధములు. అందు భేదమనునది కాకపోవు

ట- అత్యంతాభావమనునది లేకపోవుట- ఘటము కాదు అనఁగా ఘటభేదమున్నది అనుట- ఇందు కాకపోవుట యను భేదమునకు ఘటము ప్రతియోగి- ఘటము లేదు అనునప్పుడు లేకపోవుట యనెడి యత్యంతాభావమునకును ఘటము ప్రతియోగి- అని యిట్లు ఉఁగునది) కాఁబట్టి భేదము ప్రత్యక్షముచే గ్రహింపఁబడదు- కావున భేదవ్యవహారము భ్రాంతిమూలమే-

౭౦. ఇంతియె కాక భేదమనునదీ యొకఁ పదార్థమని న్యాయముల (యుక్తుల) నెఱింగినవారు నిరూపింపశక్యము కాదు- ఎట్లన్నను- భేదము వస్తువు యొకఁ స్వరూపముఁ గాదు- అట్లయినచో వస్తుస్వరూపము తెలిసినతోడనే ఆస్వరూపమును వ్యవహరించునట్లు అన్నిటికంటె వేఱు అని భేదమునుగూడ వ్యవహరింపవలసివచ్చును- అట్లు కాదు, స్వరూపముఁ గ్రహింపఁబడినను భిన్నము అను వ్యవహారము ప్రతియోగి తలంపఁబడినంగాని కలుగదుగాన ఇచ్చట ప్రతియోగిని తలంచుట లేదు గాన భేదవ్యవహారము లేదు అని యొకప్పుడందురు- అట్లనఁగూడదు- స్వరూపమె భేదమనెడి నీకు ప్రతియోగ్యపేక్షను చెప్పుట యెట్లు కుదురును? స్వరూపంబును భేదంబును స్వరూపము లేకదా- విశేషమేమున్నది? స్వరూపవ్యవహారమునకు ప్రతియోగ్యపేక్ష యెట్లు లేదో భేదవ్యవహారంబునకునట్లు ప్రతియోగ్యపేక్ష లేకుండవలయును- హస్తము కరము అను వానివలె ఘటము భిన్నము అనునవి పర్యాయములు గూడ కావలసియుండును— భేదము వస్తువుయొకఁ ధర్మంబును కాదు- ధర్మమని చెప్పినయెడను దానికి స్వరూపముకంటె భేదమును ముఖ్యముగా నొప్పవలయును- ఒప్పనియెడను స్వరూపమెయయిపోవును- భేదము నొప్పినయెడను దానికి మఱియొకఁ భేదము ధర్మము కావలయును- దానికి మఱియొకఁ భేదము ధర్మము కావలయును- ఇట్లు అనవస్థ వచ్చును (అనవస్థ యనఁగా పరిసమాప్తి లేకపోవుట)- ఇది కాక జాతి మొదలగు ధర్మములతోఁ గూడిన వస్తువును గ్రహించినంగాని భేదము గ్రహింపఁబడదు- భేదమును గ్రహించినంగాని జాతి మొదలగు ధర్మములతోఁ గూడిన వస్తువు గ్రహింపఁబడదు- అని యిట్లు అన్యోన్యాశ్రయము కూడ వచ్చును (అన్యోన్యాశ్రయమనఁగా రెంటియపేక్షయును రెంటికిం గలిగియుండుట)—

ఇందువలన భేదమును నిరూపించుట శక్యముకాదుగాన ప్రత్యక్షము సత్తామాత్రమే ప్రకాశింపఁజేయునది.

౭౧. ఇంతియేకాక ఘటముకలదు, పటముకలదు, ఘటము తెలియఁబడుచున్నది, పటము తెలియఁబడుచున్నది, అని, అన్ని పదార్థములును సత్తతోననఁగా ఉనికితోనును అనుభవముతోనును చేరినవేయై కనఁబడుచున్నవి. ఇందు సత్తామాత్రము అన్ని జ్ఞానములలోనును అనువర్తించియున్నదిగాన అదియే పరమార్థము అనఁగా సత్యము. విశేషములన్నియు వ్యావర్తమానములు (జ్ఞానమునకొకకొకటి చొప్పున మాఱునవి) అగుటవలన అపరమార్థములు. త్రాటిని జూచి యనుకొనఁబడిన సర్పము మొదలగునవి వలెనే. ఒక త్రాటిని చూచి సర్పమనియు, భూమిపగులనియు, నీటిధారయనియు నిట్లు అనుకొనినప్పుడు, త్రాడు అన్నిభ్రాంతులయందును ఆధారమై అనువర్తించియున్నదిగాన అది పరమార్థముగానున్నదియే. వ్యావర్తమానములగు (మాఱుచుండెడి) సర్పము, భూమిపగులు, నీటిధార, మొదలుగునవి యపరమార్థములు.

౭౨. ఒకప్పుడు,—రజ్జుసర్పము (రజ్జువును చూచి యనుకొనఁబడిన సర్పము) మొదలగువానియందు, ఇది రజ్జువు కాని సర్పము కాదని యిట్లు రజ్జువు మొదలయిన యధిష్ఠానముల (ఆధారముల) యాథార్థ్యము (సత్యత్వము)ను తెలియఁజేసెడి జ్ఞానములచేత బాధింపఁబడుటవలన, సర్పము మొదలగునవి యపరమార్థములయినవిగాని, వ్యావర్తించుట (మాఱుట) వలనఁ గాదు; రజ్జువు మొదలగునవి పరమార్థములగుటయును బాధింపఁబడకపోవుట వలనఁగాని అనువర్తించుటవలనఁగాదు; కాఁబట్టి ఘటము మొదలగునవి బాధింపఁబడుట లేదుగాన నపరమార్థములగుటయెట్లు?, అని యందురు. అందుకుఁ జెప్పెదము. ఘటాదులయందు వ్యావృత్తి (భేదము) కనఁబడుచున్నది. దాని స్వరూపమెద్దియో విచారింపవలయును. ఘటము కలదు అనుచోటను వ్యావృత్తి పటాద్యభావస్వరూపము (పటము మొదలగునది లేకపోవుటయే స్వరూపముగాఁగలది) అయినయెడల ఘటోఽస్తి అనుదానిచేత పటాదులు బాధింపఁబడుట సిద్ధమే. కాఁబట్టి బాధమునకు ఫలమైన విషయనివృత్తి (విషయము లేకపోట) యే వ్యావృత్తి యని చెప్పఁబడును. ఆ వ్యావృత్తి, తాను దేనియందుండునో దానికి అపార

మార్థికత్వమును సాధింపుచున్నది- రజ్జువువలె, సత్తామాత్రము, బాధింపఁబడనిదైయనువర్తింపుచున్నది- కాఁబట్టి సన్మాత్రముకంటె మిగిలినదంతయు నపరమార్థము- ఇందు అనుమాన ప్రయోగంబును కలదు. సత్తు పరమార్థము; అనువర్తింపుచుండునదియగుటవలన ;రజ్జుసర్పము మొదలగుదానియందు రజ్జువు మొదలగుదానివలెనే- ఘటము మొదలగునవి అపరమార్థములు; వ్యావర్తమానములగుటవలన; రజ్జ్వాదులు అధిష్ఠానముగాఁగల సర్పాదులవలెనే-

౭౩. కాఁగా ననువర్తింపుచున్నయనుభూతియె (జ్ఞానమె) పరమార్థము- అదియె సత్తు- సన్మాత్రము అనుభూతికి విషయముగాన అనుభూతికంటె వేఱుకావలయునేయన్నను, అక్కఱలేదు- భేదమనునది ప్రత్యక్షవిషయము కాకపోవుటవలనను నిరూపింపశక్యము కాకపోవుటవలనను పూర్వమే నిషేధింపఁబడినది- ఇందువలననే సత్తు అనుభూతికి విషయమగుటయు ప్రమాణసిద్ధము గాదు- కాఁబట్టి సత్తు అనుభూతియే-

౭౪. ఆయనుభూతి స్వతస్సిద్ధమైనది- అనుభూతియగుటయె ఇందుకు హేతువు- మఱియొకట దానివలన సిద్ధించునేని ఘటాదులవలెనే అనుభూతి కాకపోవలసివచ్చును- ఇంతియె కాక అనుభూతి తెలియుటకు మఱియొకటయనుభవము నపేక్ష చెప్పశక్యము కాదు- ఏమన్నను, సత్తచేతనే (ఉన్నంతమాత్రముననే) అనుభూతి ప్రకాశింపుచుండును- ఘటాదులవలె, అనుభూతి, తానుకలిగియుండియు తెలియఁబడకుండదు- అట్లయినచో పరాధీనమైన ప్రకాశము (తెలియఁబడుట) కలదని యంగీకరింపఁగూడియుండును-

౭౫. ఇచట భాట్టమతస్థుఁడు చెప్పుచున్నాఁడు- అనుభూతి (జ్ఞానము) పుట్టినను దానివిషయము మాత్రమే తెలియఁబడును- ఘటము అనుభవింపఁబడుచున్నదీ అనికదా వ్యవహారము- ఇది ఘటమని యెఱుఁగుచున్నవాఁడు, తత్కాలమందె విషయము కానిదై ఇది అని తెలియఁబడనిదైయుండెడి అనుభూతిని కూడ ననుభవించుట కానఁబడదు- అందువలన ఘటాదుల ప్రకాశము (తెలియఁబడుట) కలుగుటకు చక్షుస్సు మొదలగునింద్రియముల సంబంధమువలెననుభూతియు (జ్ఞానము) నుండుట

యొ హేతువు- అటపైని విషయమునందు కొత్తగాఁగలిగిన ప్రకాశము (తెలియఁబడుట) యొక్క యతిశయమనెడి హేతువునుబట్టి అనుభూతి అనుమానముచేఁ దెలియఁబడును (ఊహింపఁబడును)- ఇట్లైనచో జడముకాని యనుభూతి, విషయమువలెనే జడముకావలసివచ్చునంటివే ని- అజడత్వము (జడముకాకపోవుట) అనఁగా నేమిటి? తనసత్త(ఉనికి), ప్రకాశమును(తెలియఁబడుటను) తప్పియుండకపోవుట కాదు- సుఖాదులయందుగూడ నది సంభవించును- సుఖాదులు, కలిగియుండి తెలియంబడక పోవుట లేదుకదా- కాఁబట్టి అనుభూతి (జ్ఞానము) స్వయముగానే యనుభవింపఁబడదు (తెలియఁబడదు)- మఱియొక్క వస్తువును ముట్టెడి వ్రేలికొన తననుగూడ ముట్టుటవలె నదియశక్యము-

౭౬ ఈభాట్టమతస్థుఁడు చెప్పినది అనుభూతి (జ్ఞానము) యొక్క మహిమ నెఱుంగక తనకుతోచినట్లు విజృంభించినది- విషయమునందుండెడి ప్రకాశము (తెలియంబడుట) అనునది రూపాదులవలె వేఱుధర్మము గాదు- అదిఅనుభూతియె (జ్ఞానమె)- ఇద్దఱునొప్పుకొనిన యనుభూతిచేతనె యన్నివ్యవహారములును కుదురుచుండఁగా ప్రకాశము (తెలియఁబడుట) అనెడి వేఱుధర్మమును కల్పించుట సరిపడదు- కాఁబట్టి అనుభూతి అనుమానముచేఁ దెలయఁబడదు (ఊహింపఁబడదు)- మఱియొక్క జ్ఞానముచే సిద్ధించునది యును కాదు- మఱేమన్నను- అన్నిటినిసాధించెడి యనుభూతి స్వయముగానే సిద్ధించుచున్నది-

౭౭ ఇందుఅనుమాన ప్రయోగంబును కలదు- అనుభూతి, అన్యాధీనము గాని స్వధర్మవ్యవహారము (తనధర్మము యొక్క వ్యవహారము) గలది; తనసంబంధమునుబట్టి విషయమున దానిధర్మముల వ్యవహారమునకు హేతువగుటవలన; ఏదితన సంబంధమునుబట్టి పదార్థాంతరమున దానిధర్మముల వ్యవహారమునకు హేతువగునో, అది, ఆ రెంటిలో తనవిషయమున పరాధీనత లేకయె కనఁబడుచున్నది- ఎట్లంటేని, రూపము మొదలగు గుణము పృథివి మొదలగుదానియందు తనసంబంధము వలన చాక్షుషత్వమును( చక్షుస్సుచేతఁ దెలియఁబడుటను )కలుగఁజేయుచు, తాను చాక్షుషమగుటలో రూపాదిసంబంధము నపేక్షకలదికాదు- కాఁబట్టి అనుభూతి( జ్ఞానము )తాను తెలియఁబడుటకును, తెలియ

# ప్రకటనము.

ఫెలో ఆఫ్ ది యూనివర్సిటీ, రాయబహద్దర్, అను బిరుదములు గల మహారాజశ్రీ వల్లూరి జగన్నాథరావు పంతులుగారిచే ఆంధ్రశారీరకమను పేర శ్రీమచ్ఛంకరభగవత్పాదవిరచితంబగు బ్రహ్మసూత్రభాష్యము తెనుగుచేయంబడి దానిలోని ప్రథమపాదము ముద్రింపింపఁబడినది.

దానిని హానరబుల్ శ్రీ రాజా గోడే నారాయణగజపతిరాయనింగారు చిత్తగించి శ్రీభగవద్రామానుజాచార్యవిరచితంబగు శ్రీభాష్యమునుకూడ తెనుగుగా రచియింపవలయునని సెలవిచ్చినందున ఈయాంధ్రశ్రీభాష్యము రచింపనారంభింపఁబడినది.

ఇది జిజ్ఞాసువులందఱకును లభించుటకై శ్రీరాజాగారి సెలవుప్రకారమె ముద్రింపఁబడుచున్నది.

ఇది నెల౧కి ౫౦ పేజీలుగల సంచికలుగాఁ బ్రకటింపఁబడును.

దీనిచందా.

౬ మాసములకు పోస్టేజితో ౧-౬-౦

౧ సంవత్సరమునకు ,, ౨-౧౨-౦

విశాఖపట్టణము
ఆర్షముద్రాశాల

శ్రీపరవస్తు శ్రీనివాసజగన్నాథస్వామి
అయ్యవారలుగారు